శ్రీ

గురుదత్తాత్రేయ ప్రసన్న.



# స్వానుభవము.

## పూర్వ భాగము.

భక్తశిఖామణులారా,

శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయకునిచే సృజింపబడిన యీప్రపంచమందలి సమస్త మతావలంబులు నేసాధనములచేతను దమకనుభవవేద్యంబులుగానివిషయములగూర్చి కేవలపరవాక్యమునే పరమప్రమాణంబుగా గైకొని విశ్వాసముతో వర్తించుచుండుట సర్వులకునుగోచరంబె. "యాదృశీ భావనాయత్ర సిద్ధిర్భవతితాదృశీ" ఎవరెటుల భావింతురో వారికటులనే సిద్ధించునను ఆర్యోక్తి ననుసరించి దృఢవిశ్వా

సముతో జేయుకార్యము తప్పక సఫలమగునని భారతమందల్లి ఏకలవ్యుని చరిత్రము బోధించుచున్నది. అటుల మీరును నన్నొక పెద్దగా గ్రహించి కొంతకాలమునుండి ఐహికాముష్మిక పరమసుఖాపేక్షలతో నన్నాశ్రయించి నేజెప్పినదానిలో మీచేత నైనంతవరకు కర్మయోగ జ్ఞానమార్గముల వర్తించిన మీభక్తివిశ్వాసములకు నేను మిగులసంతసించి మీకోరిక చొప్పున నింతవరకు నాకు గలిగిన అనుభవమును ధృఢనమ్మకమును మీకు బోధించి లోకవాసనను వదల దలంచితిని. ఈవృత్తాంతమంతయు మీకు వేర్వేర దెలుపుట కష్టసాధ్యమనియు మీకువలె నితరులకుగూడ నుపయోగపడ గలదనియు నిశ్చయించి లిఖితరూపమున వెలుపబూనితిని.

ప్రతిజీవుడును పూర్వజన్మమున జేసిన పుణ్యాపాపమిశ్రిత కర్మఫలముచేత బొందినయీమనుష్యజన్మములో మరల నట్టి పుణ్యా పాప కర్మములనే జేయుట స్వభావమగుటవలన నేనును అట్టివాడనని వేరుజెప్ప నేల. ఏపుణ్యా కర్మ ఫలముయొక్క బలముచేతనో బాల్యమునుండియు పరోపకారబుద్ధియు సంశయ రాహిత్యమయిన మూఢనమ్మకమును నాకుగలవు. అవియే నన్నింతవరకు బాగుచేసినవని నానమ్మకము. అటులనే ఏపాప కర్మఫలబలముచేతనో విషయాసక్తియు, వేదశాస్త్రాభ్యాస పూర్వకమయిన ఆశ్రమోచిత కర్మాచరణ శూన్యతయు, నా శీఘ్రజ్ఞానసంపాదనమునకు ప్రతిబాధకములయినవని నానిశ్చ

యము. ఇట్లుభయసాధక బాధకములచేత నిరోధింపబడిన నన్ని యజ్ఞానసాగరమునుండి దరిజేర్చుటకు హేతుభూతములైన ముఖ్యసాధనములనిందు సంగ్రహముగ దెలిపెదను. (1) పరోపకారము (2) సజ్జనసేవ (3) తీర్థాటనము (4) దేవతోపాసన (5) యోగాభ్యాసము (6) దినచర్యపరిశీలనము (7) నిర్మమత్వము (8) వేదాంతసార గ్రహణము అను యీ అష్టైశ్వర్యములు నన్ను బొంది బ్రహ్మానందునిగ జేసినవి.

## 1. పరోపకారము.

తనయొక్క తను మన ధనములకు గష్టనష్టములు గలిగినను సంతోషముతో సహించి మిగుల నుత్సాహముతో లోకానుగ్రహార్థమై చేయునుపకారమే ముఖ్యోపకారమనియు నట్లాచరించిన దధీచి, బుద్ధుడు, శంకరభగవత్పాదాచార్యస్వామి, ఏసుక్రీస్తు మున్నగువారలు శాశ్వత కీర్తులయిరనియు నాబాల్యమున మచిలీబందరునందొక మతాంతరుడు చెప్పినవాక్యము మనసున బాగుగనాటుకొని నాశక్తికొలది యటులనే పాటుపడవలయునని పుట్టిన కుతూహల చింతవరకును జెడక నానాటికభివృద్ధినొందుటచేత నేనెట్టికష్టనష్టములకైనను సహించి నిరంతర సంచారముచేయుచు, సన్మతవ్యాపకమునకై నాశక్తికొలది సద్బోధచేసి లోకులచే ననేక ధర్మకార్యముల జేయించగలిగితిని.

## 2. సజ్జనసేవ.

జ్ఞాన చిహ్నములగు "అక్రోధవైరాగ్య జితేంద్రియత్వం క్షమాదయాసర్వ జనప్రియత్వం । నిర్లోభ దాతా భయశోక హర్తా। జ్ఞానస్యచిహ్నం దశలక్షణాని" అను పదిసుగుణములు బూర్ణముగ నెక్కడియుందున్నటుల మనము గ్రహింపనశక్తులమనియు, తారతమ్యభేదముగ ఆయాసుగుణములు గలవారి నాశ్రయించి యాసుగుణసంపత్తిని బొందుటమనకు శ్రేయస్కరమనియు, కదాచిత్ అట్టిసత్పురుషులయందేమైన లోపములున్నటుల మన యజ్ఞానవశంబున మనకు దోచినను వానినెంతమాత్రము బరిగణించక యా మహనీయునియందుగల సుగుణములనే గ్రహించుట మనకుగర్తవ్యమనియు, బూర్వాశ్రమమున శ్రీశైలక్షేత్రము నందొక బావాజీ చెప్పిన వాక్యమిప్పటికి జ్ఞాపకముంచుకొని సుగుణగ్రహణమందే బుద్ధినిలిపి అభిమానరహితముగ నట్టి సత్పురుషులకు సమస్తోపచారములు జేసి వారి యనుగ్రహమును సంపాదించి మిగుల బాగుపడితిని.

## 3. తీర్థాటనము.

సృష్ట్యాదినుండియు మహర్షులును లోకసంరక్షణార్థమవతరించిన రామకృష్ణాదులును సంచరించిన భూములను మనము దర్శించుటచేతను వారు గ్రుంకులిడిన తీర్థముల మనము

స్నానపానములు జేయుటచేతను, స్థాపించినమూర్తుల మనము పూజించుటచేతను, సకల పాప విముక్తియగునని బోధించెడి శాస్త్రములందు సంపూర్ణవిశ్వాసము గలిగి నేటివరకు శిష్టులాచరించుచున్నటుల నేనును ఆసేతు శీతాచల పర్యంతమును ద్వారక మొదలు జగన్నాథమువరకును గల కర్మభూమి నంతయు నావిధురాశ్రమమున సంచరించుచు మార్గమందలి సహస్రపుణ్యక్షేత్రములలో నామాతాపిత్రాది బంధువర్గము నుద్దేశించి తీర్థశ్రాద్ధములు యథాశక్తిగ జరిపి పితృఋణ విముక్తి నొందితినని నమ్మి సంతసించితిని. అదియటుండ తీర్థాటనమునకు నాకు గలిగిన లాభముల నిందు గొంత దెలిపెదను.

(1) స్వదేశమును విడుచుటచేత స్వకీయమయిన దేశ, బంధు, గృహాదులయందలి మమకారము తగ్గుటయు, అపరిచితదేశములను సంచరించుటచేత, ధన, అధికార జనితములయిన అహంకారములు క్షీణించుటయు, క్షుత్పిపాసా శయనాదులయందు సహనముగలుగుటయు స్వానుభవైక ప్రథమ లాభము.

(2) కూపస్థ మండూకమువలె దనకంటె శ్రేష్ఠులేవిషయమున లేరనుదురూహ నశించి ప్రపంచమందు దాగ్రహింపదగిన విషయములనేకములున్నవని తెలిసికొని వాటికై ప్రయత్నించుట రెండవలాభము.

(3) పుణ్యక్షేత్రముల బెక్కండ్రు వర్ణాశ్రమోచిత నిత్యనైమిత్తికాది కృత్యముల సకాలమందు జేయుటను కండ్లా రజూచి తానును అటు లాచరింపవలయుననెడి కుతూహలము పుట్టి యా సత్కార్యములందు బ్రవర్తించుట మూడవ లాభము.

(4) అట్టి సత్కర్మాచరణమువలన గొంతపాపక్షయమై సజ్జన సహవాసమునందును, సద్విషయ ప్రవర్తనము నందును బుద్ధి ప్రవేశించుట నాలుగవ లాభము.

ఈ పైనాలుగు లాభములను గలిగించు తీర్థాటనము వలన చిరకాలము గురుసన్నిధానముననుండిసంపాదించు విద్య వలన పొందగల లాభముల నన్నిటిని అతిశీఘ్రకాలములో మాధూకరీవృత్తివలె ననాయాసముగ నొందగలిగితిని. ఈ తీర్థాటనములో మార్గమందు దటస్థించిన సత్పురుషుల దర్శన, సేవన, సహవాస సంభాషణములచేత ననేకములైన బ్రహ్మవిద్యా రహస్యముల ననాయాసముగ దెలిసికొంటిని.

## 4. దైవోపాసన.

మనము కించిద్‌జ్ఞులమనియు పరమాత్మ యొక్కండే సర్వజ్ఞుండనియు వాని నాశ్రయించినగాని మన మిహలోక సుఖముల ననుభవించి యజ్ఞానము నెడబాసి ముక్తినొంద

కాలమనియు నెల్లరకు స్పష్టంబె. భగవంతుఁ డొక్కండైనను దేశ, కాల, అవస్థా అవసరభేదములచేత ననేక నామరూపములతో నవతరించి ఆయాకృత్యముల నెరవేర్చినటుల మన శాస్త్రములే సాక్ష్యమిచ్చుచున్నవి. అట్టి అవతారములన్నియు భగవదంశములే యగుటచేత నభేదమనెడి విషయము నిర్వివాదాంశమయినను ప్రతిజీవుడును బూర్వజన్మమున నుపాసించిన, నమ్మిన, వినిన వాసనలననుసరించియు నీజన్మమున బెక్కండ్రాచరించుటను జూచియు, నాయా నామరూపములుగల దైవమునే యారాధించుబుద్ధిపుట్టి యుపాసించుచుండును. కనుక శిష్యులయొక్క సద్వాసనల ననుసరించియు ఆయుపాసనవలన శీఘ్రకాలమున నిష్టార్థసిద్ధి నొందుటకయి సిద్ధారిచక్రము ననుసరించియు వీలుగలవరకు సుసిద్ధదేవతోపాసననే శిష్యుల కుపదేశించుట గురువునకు కర్తవ్యము. ఒకవేళ శిష్యునకు పెక్కునామరూపములుగల అనేకదేవతారాధనలయందభిరుచి యుండెనేని అటులుపాసించుటవలన ననేకబాధకములున్నవని దెలియజెప్పుట గురువునకు ముఖ్యకర్తవ్యము. ఈవిషయమున నాయనుభవము నిందు దెలిపెదను. నేను ఆస్తికులును దైవభక్తులునగు సద్వంశమున జన్మించుటచేతను వేదచోదిత సత్కర్మాచరణ ప్రవరులచే బాల్యమునుండియు శిక్షింపబడుటచేతను, నాపూర్వజన్మ వాసనలు ప్రబలి దైవోపాసనలయందు ఆసక్త్యతిశయించి యెవరేయుపాసన జేయు

చున్నను వారింజూచి వారివలన నాయుపాసనావిధి నుపదేశ మునుబొంది జపించుచుంటిని. అందువలన బాల్యమునుండియే గాయత్రి, శివపంచాక్షరి, రామషడక్షరి, బాలషడక్షరి,నారా యణాష్టాక్షరి, వాసుదేవ ద్వాదశాక్షరి, హనుమద్వాదశాక్షరి, నృసింహాష్టాక్షరి, శ్రీపంచదశి మొదలగనేకమంత్రముల నుప దేశమునుపొంది జపించుచుంటినిగాని పరమార్థకృత్యముల కేర్ప రచుకొనిన కొద్దికాలములో ప్రపంచవిషయములనే గోరుచుం డెడి చంచలస్వభావముగల చిత్తముతో నీపలువిధములయిన జపముల జేయుటచేత నాకంతగా లాభమేమియు గనుపింపకు న్నను పెద్దలవలన గ్రహించిన మంత్రములను విడనాడిన పాప ము ఘటించుననుభీతితో నట్లే జపించుచుంటిని. ఇట్లుండ దైవా నుగ్రహంబున నొక గాఢ యతీశ్వరుడు బెజవాడకు విజ యముచేసి సరియైన మార్గముగానక తత్తరపడుచున్న పాంథునివలె చింతించుచున్న నన్ను జేరదీసి యిట్లని బో ధించెను.

భగవంతు డొక్కండా లేక పలువురా యని నన్ను ప్రశ్నించెను. ఒక్కండే భగవంతుడని నేజెప్పితిని. ఆభగవం తుని గుణము లేవని నన్ను మరల ప్రశ్నచేసెను. సర్వజ్ఞత్వ, సర్వేశ్వరత్వ, సర్వాంతర్యామిత్వాది గుణంబులని నేజెప్పితిని. అట్టి భగవంతుండు నీవిపుడుపాసించు వివిధనామరూపములు గల పెక్కండ్రలో నెవరని దిరుగ ప్రశ్నించెను. అందరు నట్టి

హారనియే బలికితిని. ఒక్కండని చెప్పి పెక్కండ్రజూపుట విరుద్ధమనియు, వీరందరు సర్వజ్ఞత్వాది గుణములు గలవారయిన యెడల నిందరి నుపాసించుట అనవసరమనియు దెలుప నందుపైన సమాధానము జెప్పజాలక నిరుత్తరుండనయితిని. పిమ్మట నాయజ్ఞానము నెడబాపి సులభమార్గమును జూపింప దలంపుతో నామహాసియుండిట్లని బోధించెను. ఒకవృక్షమునుండి మఱియొక వృక్షముమీదికి నిప్పు రియోజనముగ నెగురుచుండు మర్కటమునకు వృథాశ్రమయేగాని లాభమేమియు లేనట్లుల చంచల స్వభావముగల చిత్తముతో ననేక నామరూపములు గల దైవము ననేక భావనలతో నుపాసించుట వృథా కాలహరణమేగాని ఫలమంతగా లేదనియు, తనకిష్టమయిన నామరూపముగల యొకదైవమునే అవకాశమున్నంతవరకు నేకాంతమున ధ్యానించుట, తన్మంత్రమును జపించుట, సర్వదా తన్నామమును స్మరించుట, తచ్చరిత్రమును పఠించుట, తద్రూపమును వీక్షించుటవలన శీఘ్రకాలములో ఫలప్రదమగునని యు, నితర దేవతాద్వేషములేకుండ నొక్క దైవమును మాత్రమే నారాధించుట కర్తవ్యమనియు సూచనచేసిరి. ఒక్క నామరూపముగల దైవమునే యారాధింప బూనినచో నితర నామరూపముల మీదను, తదుపాసకులమీదను తప్పక ద్వేషబుద్ధి గలుగునని నేజెప్పిన అజ్ఞానవాక్యమునకు నపహసించి యిట్లని బోధించిరి. నీవలె అజ్ఞానవిశేషముచేత నితరదేవతా

ద్వేషము కొందరికి పుట్టిన బుట్టవచ్చునుగాని అది సహేతుకముకాదు. ఏలయన:—లోకమునందు బ్రసిద్ధమైన ప్రకృతి పురుషులలో బ్రకృతి స్వతంత్రముగాక పురుషాధీనమనియు, పురుషుడు వ్యవహార దక్షుండనియు, నందువలన ప్రకృతి పురుషునిలో నంతర్భావముగనే నుండుననియు, నందుచే బురుషుడే ముఖ్యోపాస్యుడనియు, నట్టిపురుషుడు బ్రహ్మ విష్ణు శివస్వరూపములచే వ్యవహరింపబడుచున్నాడనియు, వీరిలో నెవరినుపాసించినను తక్కినవారియందును తదుపాసకులయందును ద్వేషబుద్ధి గలుగుట న్యాయవిరుద్ధమనియు సప్రమాణములతో బోధించిరి. అయినను ప్రమాదవశమున ద్వేషబుద్ధిగలుగవచ్చునని సంశయముతో బలికితిని. నాబుద్ధిమాంద్యమున కమ్మహనీయుండు మిగుల నచ్చెరువొంది ప్రమాదవశమునగూడ నట్టి ద్వేషబుద్ధి కవకాశము లేకుండ త్రిమూర్త్యాత్మకుండగు దైవమునే యుపాసింపుమని జెప్పిరి. అంతట త్రిమూర్త్యాత్మకుండగు దైవమెవరనియు, నారిచరిత్రమెట్టిదనియు, నాయుపాసన ననుగ్రహింపుమనియు నే సవినయముగ బ్రార్థింప దయాసముద్రుండగు నాయలిపురుగపుండు శ్రీదత్తాత్రేయుచరిత్రమును దెలిపి నామంత్రము నుపదేశించి జనెను. అప్పటినుండియు నామనంబాదత్తాత్రేయ పాదారవిందములందే నిలిచి అన్యదేవతోపాసనలన్నిటిని దత్స్వరూపముగ భావించి విరమించితిని.

ప్రకృతమున వేదవేదాంగాది సమస్త విద్యలబాగుగా

•నభ్యసించి కల్పవృక్షముబోలె పండిత పామరుల కందఱకు గోర్కెలదీర్చుచు స్వాశ్రమోచిత కర్మానుష్ఠానముల యథావిధిగ జరుపుచు లోక విఖ్యాతిగాంచుచున్న మహారాష్ట్ర దేశస్థులగు శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్యులగు శ్రీశ్రీ వాసుదేవానంద సరస్వతీ స్వాములవారిని నే దర్శించిన పిమ్మట "జ్ఞానీజ్ఞానఫలంవేత్తి యోగీయోగఫలంతథా। జ్ఞానయోగఫలంవేత్తి దత్తాత్రేయపరాయణః" అను ఆర్యోక్తిచొప్పున శ్రీదత్తాత్రేయోపాసనవలన యోగజ్ఞానముల రెంటిని శీఘ్రకాలములో పొందవచ్చునని నమ్మకము దృఢపడి వారియనుగ్రహమునకు పాత్రుండనై వారివలన యోగజ్ఞానములందలి పెక్కు రహస్యముల దెలిసికొంటిని.

మన అర్షమత పురాణకర్తయగు శ్రీవేదవ్యాసులు నిర్గుణుండగు పరమాత్మ లోకానుగ్రహార్థమయి సగుణముగ అనేక రూపములతో నవతరించెనని పురాణములందెల్లెడల ఘంటాపథముగ నొక్కి చెప్పుచు మనుజులకు బూర్వజన్మవాసనయా గలిగిన దైవభక్తి మిగుల దృఢపడుటకయి ఆయాదేవతా చరిత్రములను దెలుపునపుడు ఆదైవోత్కర్షతను ప్రతిపాదించుచు వచ్చిరని నిష్పక్షపాతబుద్ధితో నాలోచించిన వారెల్లరు నొప్పుకొనెదరు. కాబట్టి ఏదేవతోపాసనను జేసిననుఏకాంతమున నాదేవతాధ్యానముచేయుచు, ఆదైవమంత్రమును జపించుచు, అదైవనామమును సర్వదాస్మరించుచు,

ఆద్వైత చరిత్రమును పఠించుచు, ఆద్వైతవిగ్రహమును పూజించుచు, ఆద్వైత పమును దర్శించుచునుండిన శీఘ్రముగ ఫలప్రదమగునని నానిశ్చితాభిప్రాయము.

## 5. యోగాభ్యాసము.

ఈశాస్త్రము తక్కిన శాస్త్రములతోపాటుగ వర్తమానకాలమున నంతగా ప్రచారము లేకుండుటచేత నీశాస్త్రము ముముక్షులకెల్లరకు నవసరమా ! కాదా ! అనెడి విషయమును గొంత విమర్శింప నవసరమేర్పడుచున్నది. ' జ్ఞానాదేవతు కైవల్యం ' అనుటచేత ముక్తి జ్ఞానమువలననే గలుగును. అట్టిజ్ఞానము వేదాంతశాస్త్ర శ్రవణ మనన నిధి ధ్యాసనలచేత గలుగును. అట్టి నిదిధ్యాసమునకు 'నష్టే పూర్వవికల్పేతు। యావదన్యస్యనోదయః। నిర్వికల్పక చైతన్యం। స్పష్టంతావద్విభాసతే' అనునటులచిత్తవృత్తి నిరోధమయినపుడే బ్రహ్మసాక్షాత్కారమగును. అట్టిచిత్తవృత్తి నిరోధమునకు ' యోగశ్చిత్తవృత్తి నిరోధః ' అనుటచేత యోగాభ్యాస మవసరమగును. అట్టి యోగాభ్యాసమునందు ' చలేవాతం చలేచిత్తం నిశ్చలంనిశ్చలోభవేత్। యోగీస్థాణుత్వమాప్నోతి తతోవాయుం నిరోధయేత్॥ అనుటచేత చిత్తనిరోధమునకు రేచక పూరకములతో గూడిన వాయునిరోధముచేసిన కేవలకుంభక ప్రాణాయామ సిద్ధిగలుగునని నిశ్చయింపబడినది. ఇటుల ముక్తికి యోగా

భ్యాసము సాక్షాత్సాధనముగాకున్నను పరంపరా సాధనముగ బరిగణింపబడినను యీయోగాభ్యాస మిప్పుడంతగా ముముక్షువులచేత ననుష్ఠింపబడకపోవుటకు గారణము నూహింతము. ఈకలిమాహాత్మ్యముచేత నిక్కాలంబున బెక్కండ్రు జీవనోపాధికై వేదశాస్త్రముల నభ్యసించుటచేతను, మోక్షశాస్త్రమగు వేదాంతశాస్త్రము నభ్యసించువారలు ప్రాయశఃవయోవృద్ధులగుటచేతను, కొందరు యౌవనావస్థయందభ్యసించినను యీయోగాభ్యాస కాలమందయినను తదభ్యాసమున కవసరమగు జిహ్వోపస్థాపరిత్యాగము చేయునంతటి శమదమములు లేనివారగుటచేతను, యీయోగవిద్య నశించుచున్నదని చెప్పనొప్పును.

మరియు పండితులు తామభ్యసించని యోగవిద్యయొక్క ప్రాముఖ్యతను ప్రతిపాదించిన దమకు గౌరవహాని యగునను దలంపుతో, నక్క తనకందని ద్రాక్షపండ్లను నిందించిన విధమున యోగవిద్యను నిరాకరించిన యిప్పటివేదాంతులలో బెక్కండ్రు కేవల వేదాంతశాస్త్ర శ్రవణముచేతను ఆగ్రంథములను పునఃపునః పఠనరూపమయిన మననముచేతను, చిత్తైకాగ్రతలేని చింతనమనే నిధిధ్యాసనచేతను అపరోక్ష జ్ఞానసిద్ధి యగునని బోధించుచున్నారు. వారియుద్దేశ్యప్రకారము చేయు శ్రవణ మనన నిధిధ్యాసనలవలన పరోక్షజ్ఞానసిద్ధి గలిగిన గలుగవచ్చును. చిత్తైకాగ్రతతో జేయు నిధిధ్యాసనమె అపరోక్ష

జ్ఞానమిచ్చునని శాస్త్రము లుద్ఘోషించుచున్నవి. అనుభవజ్ఞులు సాక్ష్య మిచ్చుచున్నారు. ఈయోగవిద్య నీదేశపండితులాదర ములతో నభ్యసించి, యందలి లాభముల నొందకున్నను నిజ మయిన విరాగులగు ఔత్తరీయ బావాజీలలో కొందరయిన నిప్పటికిని యీయోగమం దభిరుచిగలిగి కొంతవరకభ్యసించి యున్నారు. అట్టివారిలో శ్రేష్ఠులగు బొంబయి యిలాకా అహ మ్మదు నగరు జిల్లాలోచేరిన రాహూరి గ్రామ నివాసులగు నారాయణదాసు బావాజీగారివద్ద నీయాశ్రమమున కొంత కాలముండి యోగమును గొంతవరకభ్యసించి యందలి లాభ ముల నిప్పటికిని పొందుచున్నాడను.

ఈయోగ శాస్త్రమందు జెప్పబడిన అణిమాదిసిద్ధుల నొందిన వారెచటనైనగలరాయని పెక్కండ్రు ప్రశ్నింతురు. సిద్ధుల నన్నిటిని బూర్ణముగ నొందినవారి నేజూచి యుండ కున్నను కొన్నిటినిమాత్రము కొంతవరకు సాధించినవారు గలరని నొక్కి చెప్పగలను. మరియు యోగాంగమయిన ప్రా ణాయామమువలనను, తత్పూర్వ కృత్యములైన ధౌతి, బస్తి, నేతి, నౌలి, వజ్రోళి, త్రాటకములనెడి షట్క్రియలవలనను, ఆహార విహారాది నియమములులేక దేహమందు గలిగే వాత పిత్త శ్లేష్మాధిక్యములచేత సంభవించు సమస్త వ్యాధులును ఔషధసేవలేకయే నశించును. ఇందువలన శరీరారోగ్యాభిలా షులకును, ధ్యానాసక్తచిత్తులకును యోగాభ్యాసమవసరమని

నానిశ్చితాభిప్రాయము. ఈయోగవిషయమును విపులముగ దెలియ గోరువారిదివరకు నాచే రచియింపబడిన యోగఫల ప్రదర్శిని, యోగాభ్యాసదర్పణము అను గ్రంథములను జదువ వలయును.

## 6. దినచర్య పరిశీలనము.

ప్రతిమానవుడును దా జేయవలసిన సుకృతములను, విడువవలసిన దుష్కృతములను, శాస్త్రములచేతను, గురువుల చేతను పలుమారు బోధింపబడుచున్నను అజ్ఞానవిశేషముచేత దరుచుగ విధియైన సుకృతము లాచరించక దుష్కృతములనే జేయుట దటస్థించుచున్నది. ఎప్పటికయిన దుష్కర్మముల విడ నాడి సత్కర్మముల జేసినగాని భగవదనుగ్రహమునకు బాత్రుడు కాజాలడు. కావున విధ్యుక్త కర్మముల జేయుటయందును నిషిద్ధకర్మముల విడుచుటయందును స్వకీయ పురుష ప్రయత్నము మిక్కిలి యవసరమగుచున్నది. ఈవిషయమున సులభోపాయమును దెలిపెదను.

ప్రతివారును నిత్యము నిద్ర లేచినది మొదలు మరల పరుండువరకు దా జేసినకృత్యములన్నిటిని, నందులకై విని యోగపరిచిన కాలపరిమాణములను వివరముగ దెలియునట్టుల నొక కాగితముపైన వ్రాయుచుండవలయును. ఈకాగితమును దా నిద్రించబోవునపుడు చదివి నాటిదినమున దానాచరించిన

కృత్యములలో సత్కర్మము లెవ్వియో, దుష్కర్మము లెవ్వియో, అసత్కార్యాచరణమున కెంతకాలము వినియోగపడెనో, దుష్కర్మాచరణమున కెంతకాలమువృథాపుచ్చబడెనో యనివిమర్శించి తాజేసిన సత్కర్మాచరణమునకు తృప్తియు, దుష్కర్మాచరణమునకు పశ్చాత్తాపమును పొంది మఱుదినమున నంత పశ్చాత్తాపమున కవకాశమివ్వకుండా సత్కర్మములనే జేయుటకు ప్రయత్నించవలయును. ఈతీరున నొక సంవత్సరము వరకు దన నిత్యచర్యను విమర్శించుకొనుచూడినచో దుష్కర్మముల విడనాడి సత్కర్మములనే జేయ సమర్థుడగును.

మనము నిత్యమాచరించు కృత్యములు శారీరక, ప్రాపంచిక, పారమార్థికములని మూడువిధములుగ నుండును. అందు ఆహార, నిద్ర, సంగమ, ఆరోగ్యములనుగూర్చి చేయు కృత్యములు శారీరకకృత్యములనబడును. కామ, క్రోధ, లోభ భయ శోకాదులవిడనాడి తనకును తననేనమ్మి ఆశ్రయించిన వారికిని జీవనము జరుగుటకై చేయబడు తన వర్ణాశ్రమోచితమయిన కృత్యములను ప్రాపంచిక కృత్యములనబడును. శరీరముచే జేయబడు పూజానుష్ఠానములును, వాక్కుచే జేయబడు శాస్త్రాభ్యాస పారాయణములును, మనసుచే జేయబడు ధ్యానసమాధులును పారమార్థిక కృత్యములనబడును. కాబట్టి పైనుదహరించిన శారీరక, ప్రాపంచిక, పారమార్థిక కృత్యము

ములో నెంతెంతకాలము గడుపుచున్నది విమర్శించి వీలుగల వరకు పారమార్థిక కృత్యములం దెక్కువకాలముగడుప బ్రయత్నించుట ముముక్షువునకు గర్తవ్యము. ఈవిషయమును విపులముగ దెలియగోరువారు నాచే రచింపబడిన స్వబోధ దర్పణము (Self Instructor Form) ను చదువుకొన వలయును.

## 7. నిర్మమత్వము.

జ్ఞానసాధనమైన వేదాంతశాస్త్రాభ్యాసము నపేక్షించు ముముక్షువున కవసరమైన సాధన చతుష్టయ సంపత్తిలోఁ జేరిన శమాది షట్కములో నుపరతి చెప్పియుండుటచేతను, అట్టి యుపరతి రూపవైరాగ్యమునకు "నిర్మమత్వం విరాగాయ వైరాగ్యాత్ యోగసంగతిః యోగాచ్ఛజాయతే జ్ఞానం జ్ఞానాన్ముక్తిః ప్రజాయతే" అనినందున నిర్మమత్వమే ప్రథమ సాధనమై ముక్తికి మూలకారణమగుటచేతను, అమృతత్వ మనెడి మోక్షము కర్మలచేతగాని, పుత్రపౌత్రాది సంపదచేతగాని, ధనమూలమైన దానాదులచేతగాని లభించక యొక్క త్యాగమువలననే లభించునని చెప్పుటచేతను, అట్టి త్యాగము నిర్మమత్వము వినాలభించక పోవుటచేతను, "ద్వేపదేబంధమోక్షాయ నిర్మమేతి మమేతిచ। మమేతి బధ్యతేజంతుర్నిర్మమేతి విముచ్యతే" అనుటవలన ముక్తికి నిర్మమత్వమే ముఖ్యకారణమగుటచేతను, నిర్మమత్వమును సా

ధించుట ముముక్షువునకు ముఖ్యకర్తవ్యమనినిశ్చయించి యీ విషయమునుగూర్చి కొంత సంగ్రహముగ దెలిపెదను. ఈ ప్రపంచమం దెన్నివిద్యలనైన నేరువవచ్చును. ఎంతధనము నైన సంపాదింపవచ్చును. ఎంతకీర్తినైన పొందవచ్చును. కాని ప్రపంచ విషయములందలి మమకారమును మాత్రము వదలుట బహుకష్టము. అందువలననే పెక్కండ్రు సన్యాసులు, పలువురు విద్వాంసులు, అనేకులు వయోవృద్ధులు వైరాగ్యమునొందజాలక మోహసాగరమునబడి దరిగానక తల్లడిల్లుచుండగా విద్యాగంధములేక సకలసంపత్తులు గలిగిన పామరులగూర్చి వేరుగ జెప్పనేల. ఈవైరాగ్య మనునది ప్రతిమానవునికి శునకాదులకువలె కాలానుగుణ్యముగ తారతమ్యభేదములతో బుట్టి నశించుచుండును. దీనినే పురాణ, ప్రసూతి, శ్మశానవైరాగ్యములని పెద్దలపహసింతురు. కావున నిజమైన పరమ వైరాగ్యమన నెట్టిదో విచారింతము. ప్రారబ్ధక్షయ పర్యంతము నీశరీరమువలన ముఖ్యప్రయోజనము బ్రహ్మవిచారమేయని నిశ్చయించి తచ్ఛరీరధారణమునకై మిక్కిలి అవసరమైన క్షుత్పిపాసల కెంతమాత్ర మన్నపానములత్యావశ్యకమో అంతమాత్ర మప్పటికప్పుడు సంపాదించుటయందు మాత్రము ప్రవృత్తిగలిగి తదితర విషయముల నన్నిటిని త్రికరణశుద్ధిగా విడనాడుట పరమవైరాగ్యమని నైమిశారణ్యమునందొకముని పుంగవుడు నాకు బోధించెను. అప్పటినుండియు నాకా యు

త్కృష్టపదవి ఎట్లు సిద్ధించునని చింతించుచుంటిని. కొంతకాలము గడచిన పిదప కురుక్షేత్రమునందొక అనుభవైకవేద్యుడగు బావాజీ నాపూర్వపుణ్యవశమున దటస్థించి నాకీవిషయమున మార్గదర్శియై యిట్లనిబోధించెను. సర్వదావస్తుసన్నికర్షచేత మమకారము పుట్టి హెచ్చుచుండుటవలన ముముక్షువునకు జ్ఞాతచరదేశమైన స్వదేశమును విడనాడుట కర్తవ్యమని శాస్త్రములు దెలుపుచున్నవి. పదార్థములు దూరమైన పిదప నాపదార్థములందలి మమకారము పూర్వమువలె బలిష్ఠముకాక వాసనామాత్రముగానుండును. ఆపదార్థవాసన నశించుటకు భగవధ్యానమే ముఖ్యసాధనము. గ్రామమువిడచి గ్రామాంతరము వెళ్ళువానికి వెనుకగ్రామముదూరమై ముందుగ్రామము సమీపించునటుల భగవధ్యానమెచ్చినకొలది పదార్థవాసన తగ్గినశించును. ఇటుల భగవద్ధ్యానాభ్యాసమును బాగుగి చేసినచో ప్రథమమున నటుడు తనశిరముపై నుండెడి ఘటములనొంతరయందును వీక్షకులయందును సమలక్ష్యముంచి ద్రవ్యసంపాదన చేయునటుల ముముక్షువును భగవద్ధ్యానమును జేయుచు తన గృహకృత్యములనుగూడ మెలకువతో నెరవేర్చుకొనుచుండును. అనంతరమున భగవధ్యానాసక్తి హెచ్చినకొలది జారస్త్రీ తనలక్ష్యమును విటునియందుంచి కర్తవ్యగృహకృత్యములందంతగా బ్రేఱుయుంచక వర్తించినటుల నీముముక్షువున్ను సర్వదాభగవద్ధ్యానమందే చిత్తముంచి తదితర

వ్యవహారములను ప్రేమరహితముగ విధిలేక చేయుచుండును. అటుపైన క్రమశః అప్రియపదార్థములను విడనాడి ప్రియపదార్థానుభవమునకే బ్రయత్నించుట సహజమైనటుల ముముక్షువును నిస్సారమైన ప్రపంచ విషయముల విడనాడి పరమాత్మధ్యానమే చేయ ప్రారంభించును. ఈతీరున మమకారశూన్యుడైన పిదప తన శరీరధారణ కవసరమగు అన్నపానములకు మాత్రమె అప్పటి కపుడు స్వల్పప్రయత్నము చేయుచు, తదితరవిషయములను సుతరాం విడనాడి నివృత్తిసుఖము ననుభవించునని ఆబావాజీ సప్రమాణములతో విరళముగ బోధించెను. అప్పటినుండియు నిర్మమత్వమునకు సాధనమైనభగవద్ధ్యానమునందే యెక్కువప్రేమ పుట్టి సర్వకాల సర్వావస్థలయందు ధ్యానముచేయ ప్రారంభించితిని.





# స్వానుభవము

## ఉత్తర భాగము.

శ్రీసద్గురుపరబ్రహ్మణేనమః.

### 8. వేదాంతశాస్త్రవిచారణ.

ఇంతవరకు గ్రంథాపేక్ష లేకుండ బెద్దలసేవచేయుటచేత గలిగిన చిత్తశుద్ధితోఁగూడిన స్వానుభవైక లాభముల దెలిపితిని. ఇక దుఃఖప్రదమగు జన్మము నొందకుండ శాశ్వతసుఖమను మోక్షము నొందుటకు ముఖ్య సాధనమగు జ్ఞాన సంపాదనమున కవసరమైన వేదాంత శాస్త్రశ్రవణావసర మేర్పడినది.

ప్రతిజీవుడును సుఖము నపేక్షించును. దుఃఖమును ద్వేషించును. ఈసుఖాపేక్షయందును దుఃఖధిక్కారమందును చేయు ప్రయత్నము శ్రమసాధ్యమగుటచేత నట్టి శ్రమ జేయుట

కు పూర్వము దా ననుభవింప దలంచిన సుఖమెట్టిదియో, ద్వేషించదలంచిన దుఃఖమెట్టిదియో పరిశీలించుట బుద్ధిమంతునకు గర్తవ్యము. కాన సుఖమననేమి? దుఃఖమననేమి? ఈ సుఖదుఃఖములు దేనివలన బుట్టును? ఈసుఖదుఃఖము లెంత కాలముండును? ఈసుఖదుఃఖముల ననుభవించు వారెవరు? అని విచారింతము. ప్రియపదార్థానుభవము సుఖమనబడును. ప్రియపదార్థవియోగమును, అప్రియపదార్థానుభవమును దుఃఖమనబడును.

దేశాంతరమందుండిన మిత్రుడు మృతిజెందకున్నను మృతిజెందినటుల వార్త వినినతోడనె దుఃఖము గలుగుటవలనను, మృతిజెందినను ఆవార్త తెలియనంతవరకు క్షేమముగనున్నాడని ఆనందించుటవలనను, యీసుఖదుఃఖములు కార్యాపేక్ష లేక కేవల భావనామాత్రములుగ నున్నవని స్పష్టము. మరియు నీ సుఖదుఃఖములు బాహ్యపదార్థముల సంబంధించియుండుననియెదమా ఒకే పదార్థమొక కాలమున సుఖప్రదమై మరియొక కాలమున దుఃఖప్రదమగుచుండుటచేత సుఖదుఃఖములు కేవల బాహ్యపదార్థముల ననుసరించి యుండలేదు. ఇక నింద్రియముల ననుసరించి సుఖదుఃఖములు బుట్టుననియెదమా యింద్రియము లేకరీతిగా నుండినను దేశ, కాల, అవస్థాభేదముల ననుసరించి సుఖదుఃఖములు గలుగుచుండుటచేత సుఖదుఃఖములు కేవలేంద్రియములవలన గలుగుననియు జెప్పకూడదు.

కాబట్టి దేశకాలావస్థాభేదములచే గలుగు మార్పులకు లోబడిన బాహ్యపదార్థముల ననుసరించియు, యింద్రియముల ననుసరించియు, భావనామాత్రములైన అంతఃకరణ వృత్తుల ననుసరించియు సుఖదుఃఖములు పుట్టుచున్నవని చెప్పతగియున్నది. బాహ్యపదార్థములు, యింద్రియములు, అంతఃకరణవృత్తులు దేశకాలావస్థలచే గలిగే మార్పులకు లోబడుటచేత తజ్జనిత సుఖదుఃఖములును మాటిమాటికి మారుచు క్షణభంగురములుగ నున్నవి. కావున నిత్యపదార్థభావనయందు గలిగే సుఖము శాశ్వతమనియు, అట్టి నిత్యపదార్థ వియోగ మెన్నట్టికి లేకుండుటచేత దుఃఖమే యుండదనియు నిశ్చయమగుచున్నది.

ఇక సుఖదుఃఖముల ననుభవించు వారెవరను విషయములో సూర్యుడు సర్వత్ర సమానముగ ప్రకాశించుచున్నను, జలదర్పణాదులయందు మాత్రము చక్కగ ప్రతిబింబించినట్టుల, ఆత్మ సర్వవ్యాపకమైనను, అంతఃకరణయందు ప్రతిబింబించినప్పుడు తోచిన అవిద్యోపాధికుడగు జీవుడు కర్తృత్వభోక్తృత్వా ద్యభిమానవిశిష్టుడై సుఖ దుఃఖముల ననుభవించుచున్నాడు.

ఈపై జెప్పిన సుఖదుఃఖ విచారణచేయుటలో బ్రహ్మ, జీవుడు, బాహ్యపదార్థములు, అంతరింద్రియములు, కర్తృత్వభోక్తృత్వములు, అవిద్య, మోక్షము మొదలగు విషయము

లదెలిసికొనుట అవసరమగుటచేత నీ యంశములనెల్ల విరళ ముగ దెలిపెడి వేదాంతశాస్త్రమును గురుముఖతః తెలిసికొనుట కవసరమేర్పడుచున్నది. గావున నీ సందర్భమున గురుశిష్యలక్షణముల నించుక దెలిపెదను.

శ్రీ శంకర భగవత్పాదాచార్యులవారు ప్రశ్నోత్తర రత్నమాలలో “ అధిగతతత్వః శిష్యహితాయోద్యతస్సతతం” అని గురు లక్షణము దెలిపియుండుటచేత, శాస్త్రోక్తమైనవర్ణాశ్రమాచార సంబంధమైన అనుష్ఠానపరుడుగాక కేవల వేదాంతశాస్త్రబోధనయందు వాక్పటిమ గలిగి ప్రతిఫలాపేక్షతో శిష్యాన్వేషణముచేయువారు గాక స్వానుభవైకవేద్యులై కేవల పరమార్థబుద్ధితో శిష్యుని అజ్ఞాన సంబంధమైన తాపత్రయములను బోగొట్టుటకై సర్వదా యోచించుచుండువారినే గురువుగ గ్రహించి వారిసేవచేసి వారిదయను సంపాదించుకొని వారివలన సంశయములనెల్ల నెడబాపుకొనవలయును. ఇక శిష్యుని లక్షణముల దెలిపెదను.

అగ్నిచే కాలుచున్న యింటిలోనున్న పురుషుడు ప్రయాణయోగ్యములైన తిథివార నక్షత్రముల విచారించక బంధుమిత్రాది పరివారముకొరకును, ధనధాన్యాది పదార్థములకొరకును నిరీక్షించక నెట్టుల దన ప్రాణసంరక్షణార్థమై అత్యాతురతతో నాయింటినుండి బయలువెడలునో అటులనే

తాపత్రయాగ్ని సంతప్తుండగు ముముక్షువు తన్నివారణార్థ
మై అన్నిటిని విడనాడి గురుసాన్నిధ్యమునకు జేరవలయును.

మరియు ఘోరశాటున దారితప్పినపాంథుడు అరణ్యము
న బ్రవేశించి వ్యాఘ్రములు వెంబడించి తరుముచుండగా మా
ర్గములో కృష్ణసర్పముచేత నిరోధింపబడి ముందడుగు సాగక
తడబడుచుండగా ధనమపహరింపవచ్చిన చోరులు బాధించు
చుండగా నా పాంథు డెట్టుల పరపురుష సహాయము నపేక్షిం
చునో అట్టులనే, తానే బ్రహ్మమని దెలియక అజ్ఞానవశమున
దేహాత్మబుద్ధిచేత గలిగిన మోహారణ్యమున బ్రవేశించి దుస్సం
కల్పములచే దరుమబడుచు, ధనాదులందలి ఆసక్తి అనే దుష్టా
హిచేత నిరోధింపబడి జ్ఞానధనము నపహరించు కామక్రోధా
దులచే పీడింపబడుచున్న ముముక్షువు బ్రహ్మనిష్ఠుడగు గురువు
నాశ్రయించి జ్ఞానసంరక్షణము చేసికొనవలయును. ఇదియే తీవ్ర
మోక్షేచ్ఛ అనబడును. ఇట్టి తీవ్రమోక్షేచ్ఛగలవానినే శి
ష్యునిగ గ్రహించి వేదాంత బోధచేయుట గురువునకు
కర్తవ్యము.

ఈపై నుదహరించిన లక్షణములు గల గురుశిష్యులిద్దరు
తటస్థించిన పిమ్మట ఆశిష్యుడు గురుసన్నిధిని సవినయముగ, త
న సంశయముల బ్రశ్నరూపముగ అడుగుటయు, శిష్యుని కేవి
షయమున సంశయమో ఆవిషయమునుగూర్చియే చక్కగ దె

లియునటుల గురువు బోధించుటయు మిగుల నవసరము గావున నింతటి నుండియు ప్రాయశః శిష్యునకు దోచెడి సంశయములను, గురువు బోధించెడి సమాధానములను స్పష్టముగ దెలియుటకై ప్రశ్నోత్తర మూలముగ దెలుపదలంచితిని.

1 ప్రశ్న:—నాకీ దుఃఖ మెటులగలిగెను? ఎటుల నీ దుఃఖ నివృత్తియై శాశ్వత సుఖ మెపుడు గలుగును.

సమాధానము :—నిరపాయకరమును, అచేతనమునగు త్రాటిని మందాంధకారములో జూచి, అపాయకరమునుచేతన మునగు సర్పముగా భ్రమించి భీతినొందినటుల, శరీరత్రయము లకంటెను, అవస్థాత్రయములకంటెను, పంచకోశములకంటె ను, చతుర్వింశతి తత్వములకంటెను వేరై, అద్వితీయమై ని స్సంగమై- నిర్వికారమైన సచ్చిదానంద స్వరూప పరబ్రహ్మమే నీవుగా నుండగా, అజ్ఞానవశమువలన నీవు నిజస్థితినిదెలియ జాలక, అంతఃకరణ తాదాత్మ్యాధ్యాసవలన, దేహాదులయం దు అహమనెడి భ్రమయున్ను, గృహాదులయందు మమత్వభ్ర మయున్ను నీకు గలుగుటచేత నీకీదుఃఖము గలిగినది. దీపాదు లచేత సర్పముగా తోచినదానిని పరీక్షించుటవలన నదిసర్ప ము కాదు రజ్జువని తెలిసికొనిన పిమ్మట సర్పభయనివృత్తియై నటుల, గురుముఖతః వేదాంతశాస్త్రశ్రవణము జేసి ఆ వినినదా నిని యుక్తులచేత జక్కగ మననముచేసి సంశయములనెల్ల న

డబాసి చిత్తైకాగ్రతతో నిధిధ్యాసచేసి స్వానుభవముచేత నీవే ఆపరబ్రహ్మమని దెలిసికొనిన పిమ్మట నీకీ దుఃఖనివృత్తియగును. మరల నిట్టి దుఃఖ ప్రదమగు జన్మ మెప్పటికిని గలుగకుండ శాశ్వత సుఖము నొందెదవు.

2 ప్రశ్న:—అద్వితీయ శుద్ధపరబ్రహ్మమునందు అనేక నామరూపములుగల జగత్తెటుల గలిగెను?

సమాధానము:—అద్వితీయ శుద్ధపరబ్రహ్మమందు, అనాది కల్పితమైన ప్రకృతియే, శుద్ధసత్వగుణయుక్తమైన మాయఅనియు, మలిన సత్వగుణయుక్తమైన అవిద్య అనియు, తమోగుణయుక్తమైన తమః ప్రధానప్రకృతియనియు వ్యవహరింపబడుచున్నది. ఆమాయయందు ప్రతిబింబించిన బ్రహ్మమునే సర్వజ్ఞత్వాదిగుణములుగల యీశ్వరుడనియు, అవిద్యయందు ప్రతిబింబించిన బ్రహ్మమునే కించిద్జ్ఞత్వాదిగుణములుగల జీవుడనియు వాడెదరు. అందు సర్వాంతర్యామిత్వముచేత నీశ్వరుడొక్కడగుచున్నాడు. పరిచ్ఛిన్నోపాధులలో నుండుట చేత జీవులనేకులగుచున్నారు.

సృష్టికి పూర్వము కర్మసహితమైన జీవులు తమ యుపాధులగు అవిద్యలతోగూడి మాయయందు లీనమైనందున ఆమాయ బ్రహ్మయందు ఛాయాపురుషరూపముగ అభేదముగానుండుటచేత నాపరబ్రహ్మమును, సజాతీయ విజాతీయ స్వ

గతభేదశూన్యమగు అద్వితీయ సచ్చిదానందమని సిద్ధాంతీకరింపబడినది. జీవులయొక్క కర్మ పరిపక్వమువలన బ్రహ్మమునకు తా ననేక రూపులగుటకు సంకల్పము పుట్టగానే తమఃప్రధానప్రకృతివలన ఆకాశవాయుతేజోజలపృథ్వులనెడు పంచమహాభూతములు పుట్టె. ఆ పంచమహాభూతములు సమష్టివ్యష్టిరూపములతో సూక్ష్మసృష్టిగానుండెను. పిమ్మట నీశ్వరేచ్ఛవలన నీ పంచమహాభూతములు పంచీకరణమై సమష్టివ్యష్టిరూప స్థూలసృష్టి అయ్యెను. అపుడు సమష్టి స్థూలసూక్ష్మకారణ ప్రపంచాభిమాని యీశ్వరుడాయెను. వ్యష్టిస్థూలసూక్ష్మకారణ ప్రపంచాభిమాని జీవుడాయెను, ఈ తీరున సచ్చిదానందస్వరూప అద్వితీయ శుద్ధపరబ్రహ్మమునందు, ప్రకృతి మాయ, అవిద్య, ఈశ్వరుడు, జీవుడు మొదలగునవియన్నియు నారోపింపబడినవి. ఆరోపమనుటచేత వస్తుతఃలేనివేయని తెలియనగును.

అయితే నాశుద్ధబ్రహ్మమునం దీయారోపమెపుడు యెందుకు గలిగెనని అందరకు శంకపుట్టునుగాని ఆశంకను దీర్చుటకు శాస్త్రములును, గురువును సమర్థులుగాకుండుటచేత, కాలిపోవుచున్న యింటిలోనున్న పురుషుడు ఆయింటికి యెపుడు యెవరివల్ల యెందుకు అగ్ని సంభవించెనని యోచించుచూ ఉపేక్షించుటకంటె నాయగ్నిని వెంటనే చల్లార్చుకొనుట శ్రేయస్కరమైనట్లుల, ఆబ్రహ్మమునం దీయారోపమెపుడెందుకు

గలిగెనని విచారించుచు నుపేక్షించుటకంటె, యీఆరోపణ నివృత్తియై నాకీదుఃఖమెటుల పోయి శాశ్వతసుఖమెటుల గలుగునని విచారణచేయుట బుద్ధిమంతుని లక్షణమును కర్తవ్యమును యని పునఃప్రశ్నకవకాశములేకుండ నొక సమాధానముచెప్పెదరు. ఈ సమాధానము సంశయాత్ములకంతగా తృప్తిగా నుండదు. వారి సంశయమును భగవంతుడే కాలవశమున దీర్పగాత.

3 ప్రశ్న :—పరబ్రహ్మ ధర్మములేవి?

సమాధానము.—దేహత్రయవిలక్షణత్వము, అవస్థాత్రయసాక్షిత్వము, పంచకోశవిలక్షణత్వము, చతుర్వింశతితత్వాతీతత్వము, సచ్చిదానందరూపము ఇవి బ్రహ్మధర్మములు.

4 ప్రశ్న :—ప్రపంచధర్మములేవి?

సమాధానము.—దేహత్రయము, అవస్థాత్రయము, పంచకోశములు, చతుర్వింశతి తత్వములు, అనృతజడదుఃఖాత్మకము- ఇవి ప్రపంచధర్మములు.

5 ప్రశ్న :—ఈశ్వరధర్మములేమి?

సమాధానము.—ఈశ్వరునికి, అవ్యాకృతమాయ దేశము, ఉత్పత్తిస్థితిప్రళయములు కాలము, సత్వరజస్తమోగుణములు వస్తువులు, విరాట్ హిరణ్యగర్భఅవ్యాకృతములు శరీర

ములు, వైశ్వానరసూత్రాత్మఅంతర్యాములు అభిమానులు, ఒక్కటే జీవరూపమున అనేకమై ప్రవేశించుట యనే సృష్టి కార్యము, సర్వజ్ఞత్వ, సర్వేశ్వరత్వ, సర్వాంతర్యామిత్వములు, ఏకం, స్వాధీనము సమర్థత- ఇవి ఈశ్వర ధర్మములు.

ప్రశ్న :—జీవధర్మములేవి?

సమాధానము.—జీవునికి, చక్షుఃకంఠహృదయములు దేశము, జాగ్రత్స్వప్నసుషుప్తులు కాలము, స్థూలసూక్ష్మకారణదేహములు వస్తువులు శరీరములు, విశ్వతైజసప్రాజ్ఞులు అభిమానులు, జాగ్రత్తమొదలు మోక్షపర్యంతముండెడి సంసారముకార్యము,అల్పశక్తి, కించితజ్ఞత్వము, పరిచ్ఛిన్నత్వము, నానాత్వము, పరాధీనత, అసమర్థత, అపరోక్షత, అవిద్యోపాధి ఇవి జీవధర్మములు.

7 ప్రశ్న:—ఇట్టుల బ్రహ్మము, ప్రపంచము, ఈశ్వరుడు, జీవుడు వీరియొక్క ధర్మములు విరుద్ధములుగనుండగా వీరియందు పరస్పరాధ్యాస యెట్లువుట్టెను? మరియు నిస్సంగుడును, నిర్వికారుండును, నిష్క్రియుండును, సచ్చిదానందస్వరూపుండును, సర్వజ్ఞుండును, సర్వవ్యాపకుండును అగు పరబ్రహ్మ నేనైనపక్షమందు తద్విరుద్ధధర్మములకు దేహదారాది సంగంబును, కామాదివికారంబును, కర్తృత్వాద్యభిమానమును, దుఃఖమును, కించిద్జ్ఞత్వమును, పరిచ్ఛిన్నమును, నానాకెటుల ఘటించెను?

సమాధానము.—విచారణాభావమువలన, స్థాణువునం దుపురుషభ్రాంతియు, ఎండమావులందు జలభ్రాంతియు, ఆకాశమందు నీలత్వభ్రాంతియు, దర్పణమందు నగరభ్రాంతియు, జలమందు వృక్షభ్రాంతియు గలిగినటుల నీ అజ్ఞానవిశేషమువలన నీకిట్టి విరుద్ధధర్మములతోఁగూడిన భిన్నభ్రాంతియు పరస్పర అధ్యాసయు గలిగినది.

8 ప్రశ్న:—భ్రాంతి అననేమి? భ్రాంతిఎన్నివిధములు? అవియేవి? ఆభ్రాంతి నివృత్తి యెటులగును?

సమాధానములు:—భ్రాంతి అనగా కల్పితము. ఎట్లనగా :—శుక్తిరజత దృష్టాంతములో మందాంధకారదోషమువలన శుక్తి అని తెలియక రజతముగాగాని, అభ్రకముగాగాని, కాగితముగాగాని తోఁచినపుడు, కనుపడే రూపాదిగుణములు, శుక్తి అని తెలిసినతరువాత నశించుటచేత శుక్తియందు లేని ఆరూపాది గుణములు కల్పితములగుటచేత అట్టి జ్ఞానమే భ్రాంతి అనబడును.

భ్రాంతి అయిదువిధములు.-(1) భేదభ్రాంతి, కర్తృత్వభోక్తృత్వభ్రాంతి (3) సంగభ్రాంతి (4) వికారభ్రాంతి (5) జగత్సత్యత్వభ్రాంతి.

(1) భేదభ్రాంతి అనగా :—

జీవేశ్వర భేదము, జీవపరస్పర భేదము, జీవజడ భేదము,

జడపరస్పరభేదము, జడయీశ్వరభేదము. ఈ భ్రాంతులన్నియు బింబప్రతిబింబ దృష్టాంతమువలన నివృత్తిఅగును. ఎట్లనగా :- దర్పణమందు ప్రతిబింబించుముఖము దర్పణమందులేదు. అద్దమునుచూచే నిమిత్తము నేత్రములద్వారా బయలు వెడలిన వృత్తి అద్దము పర్యంతము వెళ్ళి వెనుకకు తిరిగి ముఖమునే చూచుచున్నది. అందువలన అద్దములో కనుపడే ప్రతిబింబము తన ముఖముకంటె భిన్నము కానందున ప్రతిబింబము సత్యమే గాని మిథ్యకాదు. అయితే ప్రతిబింబమందు కనుబడే ధర్మములు (1) బింబముకంటె వేరు (2) అద్దమందుఫుండుట (3) బింబమువలె గాక వ్యత్యస్తముగా నుండుట మొదలగు ధర్మములున్ను, యీ ధర్మములున్నటులతోచే జ్ఞానమున్ను భ్రాంతిఅగును. ఈ భ్రాంతి నివృత్తిఅయినచో బింబప్రతిబింబములు సర్వదా అభిన్నములనే నిశ్చయమగును. అటులనే శుద్ధబ్రహ్మము అవిద్యయందు ప్రతిబింబించి జీవరూపమున ప్రకాశించుచున్నది. అందువలన శుద్ధబ్రహ్మమునకును జీవునకును అభేదమే. అయితే మాయాబలముచేత జీవధర్మములగు అల్పజ్ఞత్వము, అల్పశక్తిత్వము, పరిచ్ఛిన్నత్వము, నానాత్వము మొదలగు ధర్మములున్ను యీధర్మములున్నటులతోచే జ్ఞానమున్ను మాత్రము భ్రాంతిఅగును. ఈభ్రాంతి కల్పితమని తెలిసిన తరువాత జీవబ్రహ్మలకు అభేదమనే నిశ్చయము కలుగును.

(2) కర్తృత్వ భోక్తృత్వభ్రాంతి :—

రక్తవస్త్రముమీదనుంచిన స్ఫటికము ఎర్రగా కనుపడును. ఆ రక్తవస్త్రముమీదినుండి తీసినతరువాత స్ఫటికము సహజమైన తెల్లని వర్ణముగానే యుండును గాన ఆ యెరుపు వర్ణము వస్త్రసంబంధిగాని స్ఫటిక సంబంధికాదు. రక్తవస్త్ర సంయోగముచేత స్ఫటికమునకా రక్తవర్ణము కలిగినటుల దెలియగానే స్ఫటికమందలి రక్తవర్ణభ్రాంతి నివృత్తియగును. అటులనే అంతఃకరణతాదాత్మ్య సంబంధముచేత అంతఃకరణ ధర్మములైన కర్తృత్వభోక్తృత్వాది గుణములు ఆత్మయందారోపింపబడినవి. అంతఃకరణ సంబంధముకలిగియున్న జాగ్రత్స్వప్నావస్థలయందీ కర్తృత్వభోక్తృత్వాది ధర్మములాత్మయందారోపింపబడుచున్నవిగాని అంతఃకరణసంబంధములేని సుషుప్త్యవస్థయందీ కర్తృత్వభోక్తృత్వాది ధర్మములు ఆత్మయందు గనుపడుటలేదు. గావున కర్తృత్వభోక్తృత్వాది ధర్మములు అంతఃకరణ సంబంధమైనవిగాని ఆత్మధర్మములు కావని నిశ్చయమగుచున్నది.

(3) సంగభ్రాంతి:—

ఘటోపాధియందుండిన ఆకాశము ఘటాకాశ మనబడును. ఆ యాకాశము ఘటము ననుసరించియే యుండును. గాని ఆకాశము నిస్సంగము- అఖండమగుటవలన ఘటధర్మములైన ఉత్పత్తి లయములు, గమనాగమనములు, ఆకాశమున కెంత

మాత్రము లేవు. ఘటసంబంధముచేత నీధర్మము లాకాశమం దున్నవనుట భ్రాంతియె గాని నిజముగాదు. అటులనే దేహో పాధియందుండిన ఆత్మను జీవుడనబడును. ఆయాత్మ దేహము న నుసరించియుండును. ఆత్మనిస్సంగుడగుటవలన దేహధర్మములై న జననమరణములు ఆత్మయందెంతమాత్రము లేవు. దేహసం బంధముచేత ఆత్మయందున్నటుల భ్రాంతియెగానినిజముకాదు. మరియు పంచమహాభూతములతో నేర్పడిన నీదేహము దృశ్య మగుటవల్లను, ఆత్మ ద్రష్టయగుటవలనను, దేహముకంటె భిన్న మైన ఆత్మ, నేనె దేహమనుకొనుట భ్రాంతిగాని నిజముకాదు. అటులనే దేహసంబంధమైన స్త్రీపుత్ర గృహాదులయందు గలి గే మమతయున్న భ్రాంతేగాని నిజముకాదు.

(4) వికారభ్రాంతి :—

చీకటిలోనున్న త్రాటినిచూచే నిమిత్తము నేత్రముల ద్వారా బయలువెడలిన అంతఃకరణవృత్తి అంధకారదోషము చేత రజ్జువని తెలిసికోలేక రజ్జు ఉపాధచైతన్యము నాశ్రయించి యున్న అంతఃకరణరూపమైన తూలావిద్యక్షోభజెంది సర్పవి కారమునుబొంది పాలయొక్క పరిణామమె పెరుగైనటుల అ విద్యాపరిణామమె సర్పమైనది. రజ్జూపాధి చైతన్యమునకు వి వర్తమైనదిగాని వికారము కలుగలేదు. అటులనే బ్రహ్మచై తన్యము నాశ్రయించియున్న మూలావిద్య ప్రారబ్ధవిశేషము చేత క్షోభచెంది జడచైతన్యమైన ప్రపంచరూపవికారమును

బొంది ప్రపంచముగా భ్రమకలిగించినది. ఈ ప్రపంచము అవిద్యయొక్క పరిణామమైనది. అధిష్ఠానమైన బ్రహ్మ చైతన్యమునకు వివర్తమైనదిగాని వికారము గలుగలేదు.

(5) జగత్సత్యత్వభ్రాంతి :—

సువర్ణముయొక్క కార్యమే కుండలములగుటవలన సువర్ణమునకును, కుండలములకును గల సంబంధము కార్యకారణసంబంధమనబడును. ఈ కార్యకారణ సంబంధమువలన రెంటికిని భేదము కనుపడుచున్నను సువర్ణముకంటెకుండలములు భేదముకాదు. సువర్ణమందు కల్పించబడిన కుండల సంబంధమైన నామరూపములు మిథ్యఅగుచున్నవికాని వాస్తవముకాదు. అటులనే బ్రహ్మమునకును జగత్తునకును కార్యకారణభేదము కినుపడుచున్నను బ్రహ్మకంటె జగత్తుభిన్నముకాదు. అయితే అస్తిభాతిప్రియములనే సచ్చిదానందస్వరూపలక్షణములుగల శుద్ధబ్రహ్మమునందు కల్పింపబడిన జగత్సంబంధమైన నామ రూపములు మాత్రము మిథ్య అగుచున్నవిగాని వాస్తవముకాదు.

ప్రశ్న :—నే నెవడను?

సమాధానము :—స్థూలసూక్ష్మకారణముల నెడి శరీరత్రయముకంటెను, జాగ్రత్స్వప్న సుషుప్తుల నెడు అవస్థాత్రయముకంటెను, అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమ

యు, ఆనందమయములనెడి కోశ పంచకముకంటెను, జ్ఞానేం ద్రియపంచకము, కర్మేంద్రియ పంచకము, ప్రాణవాయుపంచకము, శబ్దాదివిషయపంచకము, అంతఃకరణచతుష్టయములనెడు చతుర్వింశతి తత్వములకంటెను వేరై వీటికన్నిటికి సాక్షిగానున్నట్టి బ్రహ్మమేనీవు.

ప్రశ్న :—వీటి అన్నిటికంటె వేరని తెలిసికొనుటకు శాస్త్రప్రమాణమును, పరమాప్తగురువులగుమీవాక్యప్రమాణమును మాత్రమేనా? నాకుగూడ అనుభవముచేత తెలియునా?

సమాధానము:—శాస్త్రానుగుణ్య వాక్యమునే నేను చెప్పెదనుగాని శాస్త్రవిరుద్ధమెన్నటికిని జెప్పను. శాస్త్రమును, గురువాక్యమును అనుభవము ననుసరించియే యుండును. ఒకవేళనీ అనుభవమునకు వేరుగా నున్నట్లు తోచినయడల నీ విచారణాలోపముచేత క్రమమైన అనుభవము నీకు గలుగలేదని తెలిసికొని బాగుగ విచారించవలసినదేగాని శాస్త్రములయందును, గురువాక్యమునందును సంశయబుద్ధిగలుగకూడదు. అటులనే శరీరాదులకంటె నీవు వేరనువిషయమందు కూడా నీయనుభవమునే దృష్టాంతదార్ష్టాంతములచేత విచారించుకుని స్థిరపరచుకొనవలెను.

ప్రశ్న !—అటులైన వీటికంటెనేను వేరని తెలిసికొనుటయెటు?

సమాధానము:—పృథివ్యాది పంచభూతములు పంచీకరణానుసార మొకదానితో నొకటి సమ్మేళనమై యిరువదియైదు తత్వములతో గూడినది స్థూలశరీరము. అందు ఆకాశమితరభూతములతో సమ్మేళనముగుటచేత బుట్టిన కామక్రోధశోకమోహభయములను గుణములు నాయందుగలగాలము నే నెరుగుదును. ఆగుణములు నాయందులేనికాలమును నేనెరుగుదును. అందువలన ఆగుణములు నేను కాను. అవి ఆకాశసంబంధమైన గుణములగుటవలన ఆగుణములు నావికావు. వానిని ఘటాదులనువలె ద్రష్టనుగానుండి చూచుచున్నాను. అని ప్రతిమనుష్యుడు స్వానుభవముచేతనె తెలిసికొనవచ్చును. ఈ విధముననే వాయు సమ్మేళనమువలనబుట్టిన ప్రసారణ, ధావన, చలన, కంపన, ఆకుంచనకర్మములున్ను, తేజోసమ్మేళనమువలన పుట్టిన క్షుధా, తృష్ణ, నిద్ర, ఆలస్య, కాంతులను ధర్మములున్ను జలసమ్మేళనమువలన పుట్టినలాల, మూత్ర, శుక్ల, రుధిర, స్వేదపదార్థములును పృథివీసమ్మేళనమునపుట్టిన అస్థి, మాంస, త్వక్, నాడీ రోమపదార్థములున్ను నాయందున్నకాలమును, అభివృద్ధినొందినకాలమును, నశించినకాలమును నేనెరుగుదును. అందువలన ఆధర్మములు నేనుకాను. మరియు నాధర్మములు వాయ్వాదిభూతసంబంధములగుటచేత ఆగుణములు నావికావు. వానినన్నిటిని ఘటాదులనువలె ద్రష్టగానుండి చూచుచున్నాను. కాబట్టి పంచభూతసంబంధ

మైన స్థూలశరీరము నేనుకాదు. అందువలన యీస్థూలశరీర సంబంధమైన నామ, జాతి, వర్ణ, ఆశ్రమ, సంబంధ, పరిణామ, జన్మ మరణాది ధర్మములు నేనుకాను. ఈ ధర్మములు స్థూల శరీర ధర్మములగుటవలన నావిన్నికావు. నేను వీటికంటె విల క్షణుడను అని నీవు స్వానుభవమువలన కూడా తెలిసికొన గలవు.

ఇటులనే అపంచీకృతమహాభూతసంబంధమైన పంచప్రా ణవాయువులును, పంచజ్ఞానేంద్రియములును, పంచకర్మేంద్రి యములును, మనోబుద్ధులును చేరినైన సూక్ష్మదేహము నేను కాను నాదికాదు. మరియు కారణశరీరమనగా అజ్ఞానము. అజ్ఞానము జాగ్రత్స్వప్న సుషుప్తులను మూడవస్థలయందు న్నది. యెట్లనిన:—జాగ్రదవస్థయందు నేను బ్రహ్మనెరుగను. నేను ఇది యెరుగను. నేను అదియెరుగను అనునదె అజ్ఞాన ము. స్వప్నావస్థయందు నాకు బాగా జ్ఞానములేదు. తెలి యదు అనునదే అజ్ఞానము. సుషుప్త్యవస్థయందు నేనేమి యె రుగననునదే అజ్ఞానము. కాబట్టి అజ్ఞానము కారణశరీరసంబం ధగాని నాదికాదు. ఈ అజ్ఞానముకంటె భిన్నుడను అని స్వాను భవమువలనకూడా దెలిసికొనవచ్చును. మరియు జాగ్రత్స్వప్న సుషుప్తులనెడు మూడు అవస్థలును నేనుకాను. నావికావు. వాటికంటెవిలక్షణుడను. యట్లంటె:—దీపమున్న యొక నాటక శాలల్లో రాజు, మంత్రి, నౌకర్లు, నాయకి, వాద్యములు, సభా

సగులు మొదలగు అందరును ప్రవేశించిరి. వారు రాకపూర్వము, వారువచ్చికూర్చొనిన తరువాతను, వారచటినుండిలేచి వెళ్ళినతరువాతను ఆదీపముండియే వున్నది.

అటులనే దీపమువలె ప్రకాశరూపమైన నేనున్నటువంటినాటకశాల అనే స్థూలదేహములో, చిదాభాసుడనే రాజున్ను, మనసుఅనే మంత్రియున్ను, బుద్ధిఅనే నాయకియున్ను, పంచప్రాణములనే నౌకర్లున్ను, దశేంద్రియములనే వాద్యములున్ను, శబ్దాదివిషయములనే సభాసదులున్ను ప్రవేశించి కొంతకాలము వ్యవహరించిన కాలమే జాగ్రదవస్థయును స్వప్నావస్థయునగును. ఈ రెండవస్థలయందును దీపమువలె ప్రకాశించుచున్న నేనుండియేయున్నాను. రాజు మొదలగు వారందరి వ్యవహారములేని కాలమే సుషుప్తి అవస్థఅనబడును. ఈ సుషుప్తిఅవస్థయందును నేనుండబట్టియే ఆఅనుభవమును నిద్రలేచిన తరువాత చెప్పుచున్నాను. ఇంద్రియముల యొక్కయు, అంతఃకరణముయొక్కయు సహాయముచేత నేను జాగ్రదవస్థయందు ప్రకాశించుచు ఆజాగ్రదవస్థను నేనుగుర్తెరుగుచున్నాను. ఇంద్రియములులేకుండా కేవల అంతఃకరణ సహాయముచేతనే స్వప్నావస్థయందును నేనుప్రకాశించుచు ఆస్వప్నావస్థను నేనుగుర్తెరుగుచున్నాను. ఇంద్రియములయొక్కయు, అంతఃకరణముయొక్కయు సహాయము లేకుండా సుషుప్తిఅవస్థయందును నేను ప్రకాశించుచు ఆసుషుప్త్యవస్థను నేను గుర్తెరుగుచు

న్నాను. ఈ కారణములచేత నేను అవస్థాత్రయములకంటె విలక్షణుడనని స్వానుభవమువలననే తెలిసికొనవచ్చునుగదా.

ప్రశ్న :—మోక్షమనగా నేమి?

సమాధానము :—కార్యసహిత అజ్ఞానరూపబంధనివృత్తియు, పరమానందరూప బ్రహ్మప్రాప్తియు మోక్ష మన బడును.

ప్రశ్న :—సాక్షాన్మోక్షసాధన మేది?

సమాధానం:—జీవబ్రహ్మైక్యరూప అపరోక్షజ్ఞానము.

ప్రశ్న :—జీవబ్రహ్మైక్యజ్ఞాన మెటులగలుగును?

సమాధానము:—తత్త్వమస్యాది మహావాక్యార్థబోధ వలన గలుగును.

ప్రశ్న :—తత్పదమున నేమిబోధయగును?

సమాధానము :—మాయ-మాయాప్రతిబింబిత చిదాభాసుడు, మాయాధిష్ఠాన బ్రహ్మముచేరి యీశ్వరుడను పేరుతో తత్పదవాచ్యార్థబోధయగును. అప్పుడిందలిమాయను, మాయాప్రతిబింబిత చిదాభాసుని వదలివేయుగా మిగిలిన మాయాధిష్ఠానమై యీశ్వరసాక్షియగు శుద్ధబ్రహ్మమే తత్పదలక్ష్యార్థ మని బోధయగును.




ప్రశ్న :—త్వంపదమన నేమిబోధయగును?

సమాధానము :—అవిద్యయు అవిద్యాప్రతిబింబితచిదాభాసుఁడు, అవిద్యాధిష్ఠానమగు కూటస్థచైతన్యము. ఈమూఁడునుచేర్చి జీవుడనుపేరుతో త్వంపదవాచ్యార్థబోధయగును. ఇందులోగూడ అవిద్యను, అవిద్యాప్రతిబింబిత చిదాభాసునితీసివేయగా శేషించిన జీవసాక్షియగు కూటస్థచైతన్యబ్రహ్మమే త్వంపద లక్ష్యార్థమని బోధయగును.

ప్రశ్న :—తత్పద, త్వంపదముల కైక్యము గలుగును?

సమాధానము :—తత్పదవాచ్యార్థమగు యీశ్వరాంశను, త్వంపదవాచ్యార్థమగు జీవాంశను పరిత్యజించి, తత్పద లక్ష్యార్థమగు శుద్ధబ్రహ్మమును, త్వంపదలక్ష్యార్థమగు కూటస్థచైతన్యశుద్ధబ్రహ్మమును ఒక్కటియగుటవలన తత్పద, త్వంపదముల కైక్యముఘటించుచున్నందున తత్త్వమసివాక్య బోధవలన శివబ్రహ్మైక్య జ్ఞానముగలుగును.

ప్రశ్న :—ఈజన్మములో బాల్యమునుండియువిధ్యుక్తమైన ఆశ్రమధర్మములను, తత్సంబంధమైన సత్కర్మములను యథావిధిగ ననుష్ఠించని ముముక్షువునకు సద్గతిగలుగుటెట్లు?

సమాధానము :—ప్రాణోత్క్రమణ కాలమందు ప్ర

హించు అత్యాతుర సన్యాసమెటుల సంపూర్ణ ఫలదాయక మగునో అటులనే చతుర్విధ ఆశ్రమధర్మములను తత్సంబంధ మైన సత్కర్మములను అనుష్ఠించజాలకున్నట్టియు తర్కవ్యాక రణపూర్వమీమాంసాది శాస్త్రపూర్వకమైన వేదాంతశాస్త్ర శ్రవణమననినిధిధ్యాసనాదులు చేయగల పాండిత్యము లేనట్టి యు ముముక్షువు త్రికరణశుద్ధిగా వైరాగ్యము నొందినతరువాత శ్రీశంకర భగవత్పాదాచార్యస్వాములవారిచే రచియింపబడిన బ్రహ్మానుచింతనమును పఠించుచు, అందుసంపుటిచేయబడిన బ్రహ్మైవాహం- నసంసారీ- ముక్తోహం- అనువాక్యములను శ్వాసోశ్వాసలవలె మరణపర్యంతము సర్వదా స్మరించుచుండిన దప్పక అపరోక్షసాక్షాత్కారరూప బ్రహ్మప్రాప్తి గలుగునని శ్రీశృంగేరీ శ్రీజగద్గురువులగు శ్రీసచ్చిదానంద శివాభినవనృసిం హభారతీస్వాములవా రుపదేశించిన విధమున నెట్టి ముముక్షువు నకైనను దప్పక ముక్తి గలుగును.

ప్రశ్న :—ఈజీవబ్రహ్మైక్యజ్ఞానమువలన దుఃఖ నివృ త్తియెట్లగును?

సమాధానము:-ఇదివరలో జేయబడిన తత్వమసివాక్యా ర్థవిచారణవలన మాయాఅవిద్యా నివృత్తియు, తత్కార్య సహితప్రకృతినివృత్తియు, పిదపప్రకృతికిని, బ్రహ్మకునుగలద నిశోచే సంబాధనివృత్తియు, పిమ్మటజీవేశ్వరభేదభావనివృత్తి యు, తరువాత కర్తృత్వభోక్తృత్వ బాధనివృత్తియుగలిగి

తుదకు దుఃఖనివృత్తియగును.

ప్రశ్న:—అటులజీవబ్రహ్మైక్య నిశ్చయజ్ఞానముగలిగిన జ్ఞానియొక్క ప్రవర్తన మెట్లుండును?

సమాధానము:—నిర్మమత్వప్రకరణమందలి పరమ వైరాగ్యలక్షణానుసారముగ కేవల ప్రాణధారణకు ముఖ్యావసరమైన క్షుత్పిపాసల కప్పటికప్పుడవసరమైనంతవరకే యాదృచ్ఛికముగా లభించినంతటిలోనే తృప్తినొంది సమస్తప్రపంచవ్యవహారములను త్రికరణశుద్ధిగా వదలి సర్వదా నిర్వికల్ప సమాధిలోనుండి బ్రహ్మానందానుభవమునొందుచుండును. ఇట్టిస్థితి అత్యుత్కృష్టమని తెలియనగును. అటులగాక మరియే పూర్వజన్మమందలి కర్మఫలబలముచేతనైనా విడువబడిన బాణమువలె శరీరపతనపర్యంతము ప్రపంచవ్యవహార ప్రవృత్తియందే యుండవలసి వచ్చే జ్ఞానివిషయములో అట్టి జ్ఞాని యెల్లప్పుడు మమకారరహితుడై నాటకమందలి పాత్రములు ఆనాటకసంబంధమైన హరిశ్చంద్రాది వేషములు ధరించి, ఆవేషోచిత లీలలను జరుపుచుండియు, తనయొక్క నిజనామరూప స్థితులను గుర్తెరిగియుండి లోకవినోదార్థమై నాటకమాడుచున్నట్టుల, తాను నిర్వికార చైతన్యపరబ్రహ్మమేగాని, నామరూపాత్మకమైన జీవుడనుగాదని యిదివరలో దృఢంజేసిన అవిచ్ఛిన్నభావనచేత కృతనిశ్చయుడై

దాజేయు కృత్యములందు దనకు కర్తృత్వభోక్తృత్వములు లేకపోవుటచేత నాకర్మఫలముల దాననుభవించనని నిశ్చయమైనందున నందలి సుఖదుఃఖములకు భ్రమించక తాననిర్లేపుడై వర్తించుచూ సర్వదా బ్రహ్మానందమగ్నుడై యానందించుచుండును. అయితే యీయుభయవిధ ముక్తులలో నెవరు శ్రేష్ఠులను శంకపుట్టును. ముక్తివిషయమున నుభయులు సమానులేయైనను, ప్రపంచవ్యవహార నివృత్తియందుండినవారికి సర్వదా సుఖప్రతీతియు, ప్రపంచవ్యవహార ప్రవృత్తియందుండు వానికి దుఃఖప్రతీతియు గలుగుచుండును. కావున ప్రవృత్తియందున్నవాని కంటె నివృత్తి యందుండినవారే శ్రేష్ఠులని నానిశ్చితాభిప్రాయమగుటచేత, నేనికముందట్టి నివృత్తి పదవి నొంది శరీర పాతపర్యంతము నేకాంతమునసుండి సర్వదా బ్రహ్మానంద సుఖము ననుభవించుచూ అస్మద్గురు పుంగవులు నాకొసంగిన మోక్షపట్టమును సార్థకపరచుకొన దృఢనిశ్చయుండనై పరమార్థవిషయమున నాకుగల నమ్మకమును, నా స్వానుభవమును మీయుపయోగార్థము మీకొరకు చెప్పిన యీచిన్నిగ్రంథమును సంగ్రహముగ వ్రాసితిని. సర్వే జనాస్సుఖినో భవంతు.

శ్రేయోభిలాషి,
శ్రీబ్రహ్మానంద సరస్వతీ స్వామి,
శ్రీదత్తాత్రేయమఠం, నెల్లూరు.

---

